శ్రీ

# సకలేశ్వరైకాంత సేవ.



ద్విభాష్యం పుల్లక

రచియింపఁబడి

ఇయ్యాని

శ్రీ రాజా రావు చెల్లయమ్మారావు బహద్దర్ జమీందారిణీవారి

సంస్థానోద్యోగులగు

పిరాట్ల సూర్యనారాయణ గారిచే

తమ హృదయాంతర గర్భిత పరిభక్తి, దైవభక్త్యాది ప్రకటనార్థమై

ముద్రింపించి ప్రచురింపఁబడియె.



చిత్రాడ:

శ్రీరామవిలాస ముద్రాక్షరశాల,

1921.

వెల రు 0—4—0

# ఉపోద్ఘాతము.

——:-(o)-:——

ఈ యక్షగాన ప్రబంధమును శ్రీ సకలేశ్వరైకాంత సేవారచనకు ఎరవరము, కోలంక వగైరా యెస్టేట్ల జమీందారిణీ వారగు మహారాజరాజ శ్రీ శ్రీ శ్రీ రాజా రావు చెల్లయమ్మారావు, మ. రా. రా. శ్రీ. శ్రీ. శ్రీ. రాజా రావు రామయ్యమ్మారావు బహద్దరు వారితరపున దివాన్. మ. రా. శ్రీ. ఆకొండి వేంకటరత్నము పంతులుగారు, ఏతత్సకలేశ్వరధ్యానాధీన చేతః కుతుకమున బ్రోత్సాహకులై శ్రీప్రభ్వీపమంకితాలంకరణ కృతిగా రచియింప వలసినదని నాకానతిచ్చుటయే యీగ్రంథరచనకు మూలము.

2. పిమ్మట నీగ్రంథరచన కారంభించు నపుడెల్ల నీశ్వర సంకల్పమగుటవలన నెద్దియో యొక విఘ్నము తటస్థించుటచే నీగ్రంథము శీఘ్రసంపూర్తి కాకుండుటకు రెండవ కారణము.

3. మఱియు, కవి, కవనంబును, గాయకుండు గానంబును, వారివారి మానసోత్సాహ సమయంబున నేదప్ప నిర్బంధించుటవలన నొనరించిన ఆ నూతన గానములు రసపోషణాలచే రంజిల్లని యగుటవలన నుత్సాహ సమయమునకు నిరీక్షింపుచుండుటం గూడ నీగ్రంథరచ నాలస్యమున కొకింత మూడవ కారణము.

అట్టియెడ ప్రాచీనులకు, పిమ్మటివారును, ఆధునికులకు, ప్రాచీనులు, పరమభాగవతోత్తములు నగు శ్రీ. బ్ర. శ్రీ మద్దిరాల వేంకటరాయభక్త ప్రణీతమగు శ్రీకుక్కుటేశ్వరైకాంత సేవయను మాతృక నొకటి నాకొసంగి యందలి సందర్భాంశము లన్నియు నుండులాగున క్లుప్తపఱచి రచింప వలసినదని శ్రీవారి సంస్థాన రాజకీయ గౌరవాదర్శప్రియగు బ్రహ్మశ్రీ సుసర్ల ఇచ్ఛారాయశర్మగారు ప్రధానపురుషు

య[illegible]యననో, నాకనుజ్ఞ నిచ్చుచు ఏకాంత సేవా గ్రంథ భానూదయమునకు నిరీక్షించియున్న వారివారి మనఃపద్మము కుళంబులు వికసింపఁజేసుకొను తలంపుతో సద్యస్కాల గ్రంథోదయ మునకై యొకనాఁడు పీఠపట్టణవీథి కారాజ మార్గంబున నాకభిముఖు లై, భావగర్భిత సంపూర్ణసదయులై, సహజమిత్రులయ్యును, ఈశ్వర భక్తి ధ్యానాతురత్వంబున నేకాంత సేవా ప్రబంధ శీఘ్రసంప్రాప్తి కొ ఱకు నాతోఁ తాత్కాలిక కష్టనిష్ఠురకంఠశోషణ గంభీరభాషణముల తోఁ బ్రసంగించిరి.

ఆయన మనోధర్మమును వారి సాంఘిక భక్తాగ్రేసరుల నిజో ద్దేశమును యెఱింగిన వాఁడగుటచే దైవ కార్యాతురత వలన బలికిన ఆయన కఠినోక్తులను శిరీషకుసుమ పేశల ప్రియవాక్యముగ నాలించి నా యవ్యక్త మాధుర్యమంజు లాలాపములచే లాలించి శీఘ్ర రచన మొనర్చి గ్రంథ మర్పింతునని శపథంబుఁగావించి ఆయనదరి దయానుకూలము గు సెలవునంది నా నిజ నివేశంబగు దుర్గాడ కరిగి నామందిరంబునం బ్రవేశించి శపథానరోధము గాకుండ నానాఁటి రాత్రియే గ్రంథరచన మారంభించి కొంత దనుక వ్రాసితినిగాని మాశ్యకాగ్రంథ కల్పనము గాక వేఱు కల్పనలతో బూరింపం దలంచుచుండ నంతలో శంఖవర గ్రామ వాస్తవ్యుండును, కవితా రసికుండును, బ్రహ్మ విద్యాభ్యాసి యు, నాదు మేనయల్లుండు నల్లుండు నగు శ్రీ. చి. యగు ఆశవిల్లి సు బ్బారావు తత్కాలమున నామందిరము నందుండుటచే నాచేయు గ్రంథరచనా ప్రయత్నమును కల్పనావిషయమై కలిగిన నానిజోద్దేశ మును కనిపెట్టి గౌరీసన్నిధానాంతరుండగు నీశ్వరు నన్వేషించుటకు, దూతిక నంపించుటలో నాయకుఁడగు నీశ్వరుం డెన్నటి నుండినట్లు నిర్దేశించి నాయిక యగు పార్వతి తన దూతిక నంపించి నట్లుండవలె నని తలంచుచున్న సమయమున నతఁడు యోగసమాధి నంగాసక్తుఁ



డగుటచే నీక్రింది విధమున నాకొక సం[illegible] ఈశ్వరుం
డు పురోపవన విహారణార్థమున కరిగి తిరిగి వచ్చుటకు కలిగిన యాల
శ్య మాత్రమునకే సహింపక గౌరి విరహయాక్రాంతయై పతిసంయో
గార్థముగ దూతిక నంపించిన దనుటకంటె నీశ్వరునకు వాసయోగ్య
మును నిర్జనప్రదేశము నగు శ్మశానవాటియందు రాత్రివేళ నిశ్చలస
మాధిలో యోగనిద్రా పరవశుండై యుండుటచే పతివియోగప్రాప్త
విరహావేశయైన గౌరి దూతిక నచటికి నాయకు నన్వేషింప నంపించెన
ని నా ప్రియుడు అని యీకల్పన నాకొసంగినాడు. ఇది క్రొత్త కల్ప
నగాఁ దోఁచఁబడి యీక్రింది విధమున రెండు పద్యము లంతక్షణము
ననే రచించితిని.

మ॥ సకలేశుండు శ్మశానవాటి నిశి సంచారానుకూల ప్రదా
యక మంచున్ దగఁజేరి నిశ్చల తపోధ్యానాంతరాత్మా సమా
ధికతన్ మోక్ష సతీ సమాగమ సమాధిన్ యోగ నిద్రావశాం
గకుండై యుండు కతమ్మునన్ పతి వియోగావేశ తామోహవ
ల్లికయై పార్వతి తన్మహేశ రతకేళీ ధ్యాన దీనాస్యయై.

శా॥ శ్రీమద్రుద్రుఁడు రుద్రవాటికను నిద్రింపంగ వేంచేయనా
థముంగూర్చి వియోగ మందియు నుతబ్బిబ్బై సఖీరత్నమున్
నామీప్యంబుగ బిల్చి ప్రాణవిభునిచ్ఛం బోఁడి తెమ్మన్న నా
భామారత్నము వేగి ముద్దులొలుకన్ బల్కెన్ మృడానీసుతోన్.

ఇట్లీ రెండు పద్యములును పూర్తిఁ జేసినతోడనే భీతియు చిత్త
వైకల్యము మొదలగు వికారములు బాడము తడబాటొనరించినవి గా
ని ఆహార నిద్రాశక్తులు కలుగక ఏకాగ్ర చిత్తముగ రచించిన గ్రం
థమువలె మూఁడు దినములకే పూర్తియైనదిఁగాని యంతటితో నాక
స్మికముగా కవనధోరణి కట్టుఁబడి యెంతయత్నించినను ఫలశ్రుతి
పద్యము రచించుట కెంతమాత్రమును, కవితాధార కలిగిన దేకాదు.

నిరాఘాటః కవనధారాప్రవాహ మింతలో మొదలంటు కట్టఁబడుట చాలా ఆశ్చర్యముగఁ దోఁచినదిగాని రేయుంబవల్లు నిద్రాహార భ్రాంతులు లేక దీక్షవహించి రచించుటచే పైత్యాధిక్యమై వేఁడిచేసినేమో యని భ్రాంతిపడి యౌషధసేవ నెంతఁజేసినను మనోమానము యథాస్థితికి రానేరదయ్యెను.

ఇట్లు తొట్రిల్లుచుండ నొక నాఁటిరాత్రి నాముఖ్యస్నేహితులు అయ్యపరాజు-కొత్తపల్లి కాపురస్థులు నగు రాయవరపు కొండలరాయుడుగారు శ్రీసకలేశ్వర భ్రాంతిగ నాకు స్వప్నసందర్శనులై, భావగారూ ? సకలేశ్వరుని వల్లకాటికిఁ బంపించినను, మూతికినుగూడ నచటికేఁ బంపించెదరా ? మీకేమి యపకారము జేసినదని మందహాసముగా నాతోఁడ ముచ్చటించుటలో ఆకల్పనలు మార్చి సకలేసుఁడు భక్తుల యిండ్లలో నుండినట్లును భక్తు లొనగించిన సేవానంద నిద్రపరవశుఁడై యచటనే యుండినట్లును, అచటికే గౌరి తనమూతిక నంపినట్లును, సవరించి మూఁడవ సంవాదమున కవిగారి యంకిత చరణమందు జీవన్ముక్తుఁడు అని వ్రాసిన పదమును మార్చి పరమపావనుడని సవరణజేసితి రేని మీచిత్తవిభ్రమ తనుఃకంపాదులు తత్క్షణమాత్రముననే నివారణమై మీ కవనధోరణి మామూలుగా ప్రవహించుననని యును, సెలవిచ్చి యంతర్ధానులైరి. అంత నిద్రమేల్కొని శ్రీసకలేశ్వరైక్యానుసంధానమానసోజ్వలానందనుఁడనై స్వప్నసాక్షాత్కార పురుషుని సకలేశ్వరుఁడని నిశ్చయించుకొని ఆ మూఁచోట్ల పదములు తీసివేసి గ్రంథమున వ్రాసియున్న ఫణితిని ఈశ్వరానుగ్రహ పురస్సరముగా సవరించుకొని ఆవెంబడినే ఫలశ్రుతిపద్య మవలీలగా పూర్తిగావించితిని. ఆయుక్తక్షణమునుండియు, చిత్తవిభ్రమ తనుఃకంపాదులద్భుతముగఁ దొలంగి యథాకవితాధోరణి కలిగినందులకెంతయు సంతసింపుచు శ్రీసకలేశ్వరధ్యానాసక్తి నానందమయుఁడనై.

సీ. శ్రీశైలవాసర శ్రీమహాద్రికి నంది
మెచ్చి యర్ధశరీర మిచ్చినావు
హాలాహలమ్ము నవ్య పాన్నంబు పగిది భు
జించి లోకముల రక్షించినావు
నిన్నెదురొ్కనిన గాండీవి నేరము క్షమి
యించి పాశుపతాస్త్ర మిచ్చినావు
శరవర్షమును మీఁద గురిపింపు మరు భస్మ
మొనరించి ప్రాణంబు లొసఁగినావు

తే. ఈకృతికి నీవు భర్తవ హీనభక్తి
గలుగు ప్రభ్వర్పణులు పేర కులు మదీయ
లేఖనీధావిత హారణంబు లెక్కయగునె
నీకు సకలేశ, పీఠికా నిగమవాస.

ఇట్లనేకవిధ స్తోత్రాకారములతో నమ్మహాదేవుని సేవించుకొన్నాఁడను. తరువాత శ్రీరాజావతంసములకును శ్రీవారి దివాంజీగా మున్నగు సాంఘిక భక్తజనంబులకును ఏతన్మహాదేవునియెడలఁగల సపూర్ణభక్తిఁ గొనియాడుచు మత్కవితా రచనము నిర్దుష్టముగాకఁ బయినను శృంగారభక్తిహాస్యరసయుక్తమగు దీనిని వంకర చెఱుకురసముగ నెనను తలంచి సహ్యాముగా రసగ్రహణ మొనర్చి యానందించు నభిజ్ఞుల కీగ్రంథరచనము నాదరించి పరిపాలించుటకు యథోచిత ప్రణతులు గావించు చున్నాఁడను.

స్వప్నసంలబ్ధ సకలేశ్వరసందర్శన మహాభాగ్యము గలిగించిన యీగ్రంథరచనా ప్రోత్సాహకులగు మ. రా. శ్రీ. ఆకొండి వేంకటరత్నంపంతులుగారికిని, సుసర్ల లచ్చారాయ శర్మగారికిని నావినయవిధేయపూర్వక కృతజ్ఞతాభివందన సహస్రము లొసరించుచున్నాఁడను.

శ్రీసకలేశ్వరానుగ్రహ దిగ్విజయ విగ్రహులును ఏతద్దేవాలయ మంటపగోపుర ప్రాకారనిర్మాణ నిత్యకళ్యాణోత్సవాది నిర్వహణ భారవహులు నగు శ్రీ. శ్రీ. శ్రీ. రావుచెల్లయమ్మారావు శ్రీ. శ్రీ. శ్రీ. రాజా రావురామయమ్మారావు బహదరు జమీందారిణీవారికి చిరాయుర్నిరంతరాఖండరాజ్య లక్ష్మీతేజోవైభవాస్పద మంగళాశాసనాశీర్వచనంబులు, కానుక లర్పించు చున్నాఁడను.

బ్రహ్మశ్రీ పన్నాల మల్లికార్జున దీక్షితశాస్త్రులవారు ప్రస్తుత ముపిఠాపురగ్రామవాస్తవ్యులై నాచేయు సకలేశ్వరైకాంతసేవాగ్రంథ మాతృకను, నాపూర్వపుణ్యవశమున నెట్లోసంగ్రహించి అయాచితాభిమానముగా నాయెడల నిర్హేతుక జాయమానకటాక్షము కలిగి, పూర్తిగా నాయశస్సును గోరుచు నీయేకాంతసేవ యందచ్చటచ్చట కొన్నిసవరణలు చేసినందుకు, శ్రీదీక్షితులుగారు నాయెడల కన బరచిన పరశ్రేయ స్నేహానమునకును మఱియు చిత్రాడ గ్రామవాస్తవ్యులు, నాంధ్రపరిశోధక మహామండలి సంస్థాపకులు, "శ్రీరామవిలాస గ్రంథమాల, అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము" సంపాదకులు, పిఠాపురం తాలూకాబోర్డు, గోదావరిజిల్లా గ్రంథాలయ సంఘోపాధ్యక్షులు, 'కావ్యనిధి' బిరుదాంకితులు, పద్మనాయక కులమండల మండనాయమానులు నగు శ్రీ చెలకాని లచ్చారావుగారు స్వకీయముద్రాక్షరశాలయందు నిప్పొత్తమును నుచితముగ ముద్రింపించినందుల కెంతయువారికిఁ గృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాఁడ

సర్వేషాం సమస్త మంగళాని భవంతు.

24—8—1920, ఇట్లు,

దుర్గాడ. ద్విభాష్యం పుల్లకవి.



ఓమ్, తత్సత్.

# శ్రీ సకలేశ్వరైకాంత సేవ.

## గణపతి స్తవము.

బెహాగ్ రాగము—ఏకతాళము.

వక్రతుండ నాగ-వారణ వదనా-యక్రూరావన యనఘ నమో॥ వ॥
విఘ్నరాజ కంజ-మఘ్నద యూళూ-విఘ్నిత మోరాక్ష-విజయ నమో॥ వ॥
శూర్పకర్ణధృతి-సర్పమండన-దివిజాధిప వం-దిత చరణ నమో॥ వ॥
రాజ రాజ హిత-రాజ మౌళిసుత-రాజ తేజగణ-రాజ నమో॥ వ॥
రావు చెల్లాంబికా-రాధిత చరణా-రామయాంబికాంత-రంగసత్సదనా॥ వ॥
మూషక తురగద్వి-భాషి పుల్లకవి-పోషక సుగుణవి-భూష నమో॥ వ॥

## —• సరస్వతీ ప్రార్థనము •—

బిళహరి రాగం—చాపుతాళము.

దేవీ నమామి సదా-దేవస్తుతాంచత్పదా
రావే కళావరదా-ప్రోవవే శారదా॥ దే॥
జలజాక్షునిరాణీ-పలికింపవే గీర్వాణీ
కలితపుస్తకపాణీ-లలితబంభరవేణీ॥ దే॥
భాసురగుణకదంబా-వాసవసన్నుతాంబా
హాసజితేందుబింబా-దాసావనావలంబా॥ దే॥

సంగీత విద్యావధీ-సాహిత్య సంపన్నిధీ
శృంగార లీలానిధీ-రంగత్కృపాజలధీ॥
శ్రీ రావు చెల్లయాంబా-సేవిత చరణాంబా
శ్రీ రమ్య రామయాంబా-జిహ్వాగ్ర నిలయాంబా॥ 1
అవిత ద్విభాషి. పుల్ల-కవి రాజ కవితోజ్వలా
స్తవనీయగుణజాలా-భువన సంస్తుతశీలా॥ 2

శ్లో॥ శ్రీకైలాస గిరీంద్ర వాసమభయం శ్రీకంఠమాశాంబరం
కల్యాణాఢ్య గుణావహం పసుపతిం కారుణ్యపాథోనిధిం
చంద్రార్కానల లోచనం పురహరం గంగాధరం శంకరం
సాంబం శ్రీసకలేశ్వరం స్మరమనః పీఠాపురీవాసినం.

శ్లో. శ్రీమద్భక్తజనావన ప్రముదితం శ్రీబాలకామేశ్వరీ
పర్యాయాంచిత పార్వతీ విమలహృద్రాజీవమిత్రం శివం
శ్రీయాకొండికులావతంసవరదం శృంగారలీలాస్పదం
ప్రాంచద్వేంకటరత్నపండిత దివాకర భక్తప్రియం సర్వదం
సాంబం శ్రీసకలేశ్వరం స్మరమనఃపీఠాపురీవాసినం.

శ్లో. శ్రీమద్రావుకులాబ్ధిచంద్రమస సూర్యారాయరాజక్షమా
లక్ష్మీనామపవిత్రతాతిలక చెల్లయ్యాంబికా సేవితం
శ్రీరామారమణీ సతీహృదయగేహం మంగళాంచద్వపుం
సాంబం శ్రీసకలేశ్వరం స్మరమనఃపీఠాపురీవాసినం.

చూర్ణిక.

శ్రీమదఖిలచరాచరజగజ్జాలరక్షాదక్ష కరుణాకటాక్షవీక్షణాలంకార శారదానారదశరశరదభ్ర శరచ్చంద్రకాధవళాంభోరుహాంచద్యశస్సార కర్పూరహార మహితహిమాద్రిజామంద సౌంద ర్యారుణాధరబింబామృతాస్వాదనాలబ్ధ మాధుర్య మంజువచఃప్రవాహాభూషాయిత శేషాలంకృత దేహాసకలశాత్రవలతాలవిత్ర సూర్యచంద్రాగ్నినేత్ర దేవదానవగరుడగంధర్వకిన్నరకింపురుషసిద్ధసాధ్యచారణచతుర్ముఖప్రముఖనిఖిలబహిర్ముఖస్తూయమానావతరుణారణరంగరంగత్తుంగపరాక్రమ

శ్రీమచ్చరణా ప్రణతభక్తానేకకిల్బిషౌఘనిబిడాంధకారసూర శుంభదంభోధి హృదయగంభీర జగజ్జేగీయమాన జయశబ్దప్రపంచ గళారవజనకడమరుకాడంబరశూలాయుధాద్యలంకృతప్రహస్త గరుడధ్వజపదారవిందజంజనిత పవిత్రతరవియద్గంగాతరంగ కమనీయ జటాకలాపమస్త కన్యస్తశశిప్రశస్తనాదబిందు కళాంచితలయబ్రహ్మాహ్వయాత్మానాత్మా ప్రకృతి వికృతిలక్షణాతీత పరమేశ్వరస్వరూప ఘోరవిగ్రహ విజయప్రతాప దిగంతవిశ్రాంతి తప్రకాశకోటిఖద్యోత సంతతైశ్వర్య సర్వమంగళాసమేత శిక్షితానేక దురాగ్రహ? గ్రహానుగ్రహ విగ్రహాశ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకా సాధుజనచింతితాభీష్టఫలప్రదాయకా అనవద్యహృద్య వేద వేదాంతవేద్యమహాదేవ మహానుభావదేవతా సార్వభౌమ ప్రణవపూర్వకపంచాక్షరీ మహామహిమాభిరామ పురాణపురుషోత్తమ సత్తమ శ్రీమద్బాల కామేశ్వరీసుందరీ హుంకారిణీ మనఃపంకేరుహాలంకారచోరాపురుహూతికాపట్టణాలయ శ్రీమత్సకలేశ్వర చంద్రశేఖర శ్రీకర భవదేకాంత సేవక హృదయారవింద మిళిందాయమానాభిధేయ పరివేష్టిత ప్రమథ గణ సముదయ సావధాన పూర్వకం తావకైకాంతసేవా విధానమవధారయః.

ద్విపద.

శ్రీమదఖండల • క్ష్మీ చిద్విలాస
శ్రీమించు చెన్నపు • రీరాజ్యమందు,
శ్రీరమ్యగోదావ • రీ మండలమున
రారాజులందుఁ బే • ర్వడిన యతండు
రావువంశాబ్ధిపూ • ర్ణసుధాకరుండు
కోవిద స్తుత దివ్య • గుణ మండనుండు
ననఘ లక్ష్మీనర • సాంబికా సుతుఁడు
ఘనతర శుభ కీర్తి • కాంతా రతుండు
భూసురాశ్రిత కల్ప • భూరుహంబగుచు,
భాసిల్లు సూర్యారా • ట్ప్రభు ధర్మపత్ని,

ప్రసూత చెల్లాంబికా • రాజ్ఞీమతల్లి
గణనాతిశయరూపి • కలవెవజల్లి
ప్రాకార హర్మ్యోద్ధ • రణవైభవంబు,
వీకమై నిర్మింప • విలసిల్లు సాంబ,
జగతి దద్రాక్షీ స్న • షారత్నమగుచు
నెగడు రామాంబకు • నెనరుదైవంబ
రాజశిరోభూష • రమ్య విలాస
రాజితాద్రినివేశ • లావణ్యవేష
కరకురంగ సితాంగి • గంగోత్తమాంగ
పురదైత్య భంగప్రి • స్ఫుటదివ్యలింగ
శుంభద్గుణకదంబ • సురగణాలంబ,
శంభోసదాశివ • శంకరసాంబ,
భుజగేంద్రభూష • సంపూర్ణసంతోష
ద్విజబిడౌజముఖ స • మర్చిత చరణ,
శ్రీసకలేశ యా • శ్రితజనపోష,
హాసనిర్జిత చంద్రి • కాంచద్విశేష
యాకొండి కులకల • శాబ్ధిచంద్రుండు,
ప్రకట వేంకట • రత్నసుకీర్తి,
వీరవరాధీశ • విఖ్యాతమంత్రి,
పారమార్థిక బుద్ధి • పరిశుభ్రమూర్తి,
మణిమయ గోపుర • మంటపములును,
క్వణదురు కింకిణీ • ధ్వజశతాంగములు,
భక్తిమై నిర్మింప • బ్రాభవంబునను,
సక్తినొప్పారిన • జంద్రార్ధమౌళి,
భక్తకల్పద్రుమ • వైభవస్తోమ,
ముక్తిధామాకృతి • మునిజనకామ,
చిత్తమందేకాంత • సేవావిధంబు,
చిత్తగింపుము దయ • చిగురింప దేవ,

లాలిపాటలు మంగ • ళములు నేలలును
జోలరెచ్చరికలు • చూర్ణికల్ వెలయ,
బద్యగద్యములు ద్వి • పదకీర్తనములు,
వ్యాద్యమానట్లుగా • నేకాంతసేవ,
ప్రాకటలీల • వర్ణనలు సేసి
నీకొసంగెద భవా • నీచిత్తచోర,
పాహిమాం పాహిమాం • భవనాశయీశ,
జోహర్లు జోతలు • జోబిల్లునామి,
భక్తజనంబులు • పఠియించిదీని,
భుక్తిముక్తులు గల్గి • ముదమొందుచుండు
రహిభూషితాంగి మ • హాద్వృషతురంగ
రహిని శ్రీసకలేశ్వ • రా మంగళాంగ.

మ. సకలేశుండు నిజాశ్రిత ప్రకరభా • షాస్తోత్ర లోలాత్ముడై,
యకలంకస్థితి భక్తగేహకృతసే • వానందని ద్రావశాం
గకుడై యుండుకతమ్మునన్ పతివియో • గావేశితా మోహవ
ల్లికమై పార్వతి తన్మహేశరత కే • ళీధ్యానదీనాస్యమై.

శా. శ్రీమద్రుద్రుడు భక్తసంఘములు సం • సేవింప వెంచేయు నా
భీమంగూర్చి వియోగమందియు నుత • బ్జెబ్జ సతీరత్నమున్
సామీప్యంబుగఁ బిల్చిప్రాణవిభు ని • చ్చందోడి తెమ్మన్న నా
భామారత్నము నేఁగి ముద్దులొలుకన్ • బల్కెన్ మృడానీశుతోన్.

దూతికా రాయబారము.

శా. శ్రీలీలాసతి నన్నుఁ బంపినదిరా • శృంగారితా శాంబరా
నాలాలిత్యపు పల్కులన్ మదిని వి • న్నాణంబుగానిల్పరా,
మేలొప్పన్నను దెల్పుమన్న మనవుల్ • మీసన్నిధిన్విన్నైదన్
చాలన్ శ్రీసకలేశ పీఠపురవాసా వ్యోమకేశా శివా.

పద్వ. శ్రీరమామణీ మనోహర • సేవితాంఘ్రి సరోరుహా
నారదాదిమునీంద్ర దైత్యగ • ణార్చితా వృషభధ్వజా

6

చామచాప భ్రూ[illegible]గమంగళ • శారదాభ్రి యశస్కరా
[illegible]గిరిశ గిరిజా • కాంతనిన్ బిల్చిందిరా.

మ. తమకంబై తగు నీవియోగమున కం • దర్పుండు దర్పంబుగా
సుమవక్షోజ యుగంబుసన్ గుసుమబా • ణోద్ఘాటముల్ సేయగా
నిముసమ్మొక్కయుగాంత మయ్యెగదరా• నిర్నిద్రయై సుక్కరా
సమతన్ శ్రీసకలేశ పీఠపురవా • సా వ్యోమకేశా శివా.

దర్వ. మారవిగ్రహమారణాస్త్రన • మానచంచదనుగ్రహా
భూరియోగిని సేవితాసుర • పూజితాంఘ్రిసరోరుహా
మారుబారికి నోర్వకనుపలు • మారుదూలి కృసించెరా
కూరిమిని సకలేశ చిల్కల • కొల్కి నిన్ బిలిచిన్నిరా.

శా. రాకాచంద్రుడు పండువెన్నెలలని • ర్వార్యంబుగాగ గాయగా
కేకుల్ కేకలువేయగా పలుమరుం • గీరంబులుంగూయగా
ధాకన్ మారుడుకూరుడై తనయ • ఖండ పౌత్రితోడాయగా
జోకయ్యెన్ సకలేశ పీఠపురవా • సా వ్యోమకేశా శివా.

మత్తకోకిల. తాపమార్పక తాళలేక న్ను• ధాశ్రిమన్ గదుఁజెందెరా
పాపమన్మథ మారణాంచదు • పాయమెఱుగుదు నన్నిరా
రాపుసేయక వేగరార ప • రాకునొందక శంకరా
కోపమానకలేశ నానుడి • కొమ్మ నిన్ బిలచిన్నిరా.

శా. జంబాల ప్రతిభావిలాసిత మహా • జాంబూనద స్వచ్ఛదే
హాంబున్ మిక్కిలి సుక్కిచిక్కెనుర నీ • యందాసచే సుందరా
తాంబూలం బిడెనీకొసంగినదిరా • దాక్షిణ్యమున్ జూపరా
సాంబా శ్రీసకలేశ పీఠపురవా • సా వ్యోమకేశా శివా.

దర్వ. జాలమేలర, జాలమేలర • శాంకరిన్ వనియింపరా
ఏలరా గతిలేలరా మన • వేల రమ్మని వేలరా
గోలరా మరుగోలరా పిడి • గోల రమ్మనిగోరెరా
వీలుగాసకలేశ యాయలి • వేణి నిన్ బిలచిన్నిరా.



శా. ఆహా యెంతవచించినన్ వినవు ని ♦ [illegible] హారముల్ [illegible]
దేహంబంతయు నీదెయున్నది రసం ♦ దేవ [illegible]
మోహావేశ భరాంగి గూడివిరహం ♦ భోరాశి దేల [illegible]
సాహాయ్యుండవునీవె పీఠపురవా ♦ సా వ్యోమకేశా శివా.

దర్వు. శ్రీధరుండ బలావతారము ♦ జెందఁజూచి భ్రమింపవా
రాధికామణివై జనించిన ♦ రాసరిన్విహరింపవా,
గాధలెందుకు గౌరినివ్వెడ ♦ గా నెఱుఁగుదువెయుంగవా
సాధకుండవునీవె గిరీశా ♦ శ్యామానిన్ బిలచిన్దిరా.

మ. ఫణిభూషల్ పులితో [illegible] ముగ్గ్రముమీ [illegible] ♦ [illegible] మానరా
మణిహారాంబరి జాలమింపి [illegible] ♦ మూల్యం [illegible]
గుణరత్నాకరగారి తోడ [illegible] ♦ గూర్మి వ్రేడిన్ వేచిరా
జనవద్యాసకలేశ పీఠపురి ♦ సా వ్యోమకేశా శివా.

దర్వు. అలదగా మెయిఁ జందనంబిదె యల ♦ ధరాకృతి కంధరా
వలదురా వెలిబూదెరా చిలు ♦ వలదు రాష్ట్రి దోలంగరా
కలదురా చెలువంపు నెచ్చెలి ♦ కలదు రాసమనంబులో
వలపుగా సకలేశ మంజుల ♦ వాణినిన్బిలచిన్దిరా.

మ. నగవా వెన్నెలతోలురా తనువు మి ♦ న్నావన్నె బంగారురా
తొగలా కన్నులు పల్కులాసుధలు పో ♦ త్రుల్ బల్ విచిత్రాలురా
ఖగయుగ్మస్తనిరా మొగంబనఁగ సిం ♦ గారంపుజాబిల్లిలో
నగమా గాసకలేశ పీఠపురవా ♦ సా వ్యోమకేశా శివా.

దర్వు. అడవిగాచిన వెన్నెలాయెర ♦ యా మెసోయగ మెన్నఁగా
తొడపుతెల్లను నేటికాస్థితి ♦ తో తటస్థములాయెగా
పడుచుపాయ్రమదెల్లనిన్నెడ ♦ బాసి పానుపుపాలుగా
నడలె శ్రీసకలేశ రమ్మని ♦ చాన నిన్ బిలచిన్దిరా.

దర్వు. కానగాఁచిన వెన్నెలాయెర ♦ కాంతసోయగ మెన్నఁగా
మానికమ్ముల భూషణమ్ములు ♦ మర్చి నేటిక నుండెగా
పానుపు నతిన పాయమెల్లను ♦ పాలుజేయుటలాయెగా
దీనయై సకలేశ పార్వతి ♦ దేవినిన్ బిలచిన్దిరా.

శా. కామక్రోధమదాది మత్సరము లిం • కైనన్ త్వరంగూల్పరా
వేమారుల్ సఖిమెచ్చ్రెక్కరా కపుటకన్ • ప్రేమించి కీలించరా
మోమునన్ మోమును జేర్చి ముద్దులిడరా • మోహంబు చల్లార్పరా
స్వామీ శ్రీసకలేశ పీఠపురవా • సావ్యోమకేశా శివా.

దరువు. కామభూతము బట్టెసందను • గౌరి నిన్నె జపించురా
సోముకాకలు మించెనీ శిర • సుంగలాతని నొంచరా
సోమదేవియు గండుతుమ్మెద • జూచి తల్లడమందెరా
సామిగా సకలేశ నిరుపమ • శాలి నిన్ బిలచిన్నదిరా.

శా. రాకాచంద్రజటా కలాప శివరా • రారా జగద్వల్లభా
మారా మామణి కేళి నేలగదరా • మారాపహా శంకరా
రారా పువ్వులపాన్పునన్ మదన సా • మ్రాజ్యంబుచే కూర్పరా
సారస్యంబుగ పీఠపట్టణనివా • సావ్యోమకేశా శివా.

మత్తకోకిల. ఎన్నగన్నిను బాయుటీ చెలి • యెన్న(డేని యెఱుంగునా
చిన్నప్రాయమునుండి జేసిన • చెల్మిపీడి మెలంగెనా
యెన్నియైతే నేమి మక్కువ • నెల్ల నెంచి రమింపరా
సన్నగా సకలేశ సుగుణని • శాల నిన్ బిలచిన్నదిరా.

శా. శ్రీసుదావ్రు కులాకలాపమగు శ్రీ • చెల్లాంబికాపావనా
క్షేమాలంకృత రాజ్యలక్ష్మియనునా • శ్రీరామయామంబావనా
భామారత్నము నేలు మావిమలభా • స్వన్భక్త సంసేవనా
స్వామీ శ్రీసకలేశ పీఠపురవా • సావ్యోమకేశా శివా.

దరువు. రావుసత్కుల చెల్లయాంబ న • రంబులిడి పాలింపవా
పావనాన్వయ రామయాంబక • వార్యసంపదలీయవా
భావజారి పురాసురారిద్వి • భాషిపుల్లకవీంద్రు నిన్
గావవా సకలేశ చంపక • గంధి నిన్ బిలచిన్నదిరా.

క. అనియిట్లు భక్తసేవా, ఘననిద్రను జెంద తెల్వి • గలిగించుచు తా
ననియెను మృదుమధురోక్తుల, వనితసతీవిరహతాప • వాస్తవములాగిన్

చ. ఎలమిని భక్తసేవల వహింపుచు • యోగసమాధినున్న యా
వలిమలయల్లునిన్ మెలకు • వన్ దగ(జేసియు మాపరిచారముల్

పలుమరు దేల్చి గావించి శు • భంబగుగా కనినందినెక్కి దా
ఖలుమదు రాగదుర్గ మజి • కొందరితానె సురంపె కాంతలన్.
క. వనితలు శ్రీసకలేశుని గనుగొని నవరత్నదీప • కళికలు వెలుగం
నను బంగరుపళ్లెరముల గొని మంగళములను బాడు • కొనుచు న్సనుచున్.

మ ం గ హా ర తు లు.

కేదారగౌళ, లేక సురటరాగం—త్రిపుట, లేక ఆదితాళం.

మంగళంసర్వ। మంగళా। దేవ। మంగళవైభవ।రంగతాండవా॥ మం॥
సంగరవిజయ।గంగకరాంగా।గంగాకలితోత్తమాంగ।శుభాంగా॥మం॥
ఘనతరకరధృత। కలితకపాలా।వినమితసురముని। వినుతసుశీలా॥ మం॥
అణిమామహిమా। ద్యఖిలవిశేషా। మణిఫణిభూషిత। మంజులవేషా॥
భసితవిలేపనపావనదేహా। హసితపురాసుర। శ్యామలాస్నేహా॥ మం॥
ధరణీరథనా। ధనపురహరణా। పురుహూతీపుర। పూజితచరణా॥మం॥
శ్రీసుచ్చెల్లాంబికా।ర్చితమృదుచరణా। రామయాంబికాంత।రంగసత్సదనా
పాశహస్తాద్య। భాషి ఫుల్లకవి। భూసురసుపద। శ్రీసకలేశా॥ మం॥

మ ం గ ళ హా ర తి.

సురటరాగం—ఆదితాళం.

శ్రీపార్వతీవిమల। చిత్తాబ్జచోరాయ। పాపౌఘతిమిరప్ర। భాకరాయ।
గోపతురగాయగిరి। చాపాయ। ధవళశుభరూపాయ।శితభసితలేపాయతే
జయమంగళం। మహోత్సవమంగళం॥
వీరాయ।శరధిగంభీరాయ। మేరుగిరిధీరాయ।కలుషాబ్ధితారణాయ। వీరాధి
వీరాయ।విశ్వసర్వరూపాయ।నారాయణప్రియా।యభవాయ॥ జయ॥
మందారబిసకుంద।కుందాదినిభబృంద।బృందారకాప్తకీర్తి।ప్రభాయ।
యిందుమకుటాయ।గోవిందసన్మానాయ।వందారుసురముని।స్యందాయతే॥
పాలితమునీంద్రాయ।ఫాలాగ్నినేత్రాయ।శూలాయుధకలాపశోభితాయ
కాలకంఠాయసుర।జాలార్చితపదాయ। బాలకామేశ్వరీపాలాయతే॥ జయ
దోషాపహాయ।ద్విభాషిఫుల్లకవీంద్ర।పోషాయ।నిత్యసంతోషణాయ।భా
షాధిపనుతాయ।పాశహస్తాయ।శుభవేషాయ। భుజగేంద్రభూషాయతే॥
జయమంగళం। మహోత్సవమంగళం॥

గీ. రతనపు నివాళులిట్టు లా • రాములోనఁగ
సుకిరముగ నందిడిగ్గి పా • దుకలు దొడఁగి
శివుఁడు తన మందిరము ప్రవే • శించునపుడు
హెచ్చరికలను బాడి ర • మ్మచ్చకంట్లు.

---

# హెచ్చరికలు

——:-(o)-:——

## 1. వ హెచ్చరిక.

శ్రీరాగం, మధ్యమావతి—ఆదితాళం.

ఈశా భవనాశాంబర కేశాగత లేశా । ఆశాంశుక గిరిశాపర మేశా॥ హెచ్చ॥
మారాకృతిమారాసుకుమారాసుకుమారా। హారాహిహారాగిరిధీరా॥
హాలాహలసుగళాజిన। చేలాముని పాలా। బాలాయుత । సకలేశకృపాలా॥
గంగాధర।సంగీతసుసంగారిపుభంగా ।భంగీకృతత్రిపురా । సురసాంగా॥
తుంగోక్షతురంగా।భవభంగా।శివలింగా।అంగీకృతగిరిజాంతార్ధాంగా॥హె॥
పాపాంధదివాపాగిరి।చాపాగతతాపా।రూపాంతరగోపాసు।రూపా॥ హెచ్చ॥
తళుకుబంగిరు మేడలో।తల్పంబునందు।వలపుల్ గొల్పుచుగౌరిసిగలయం॥
పొందు వేళాయె।నివుడిందుఁడుదయించె।సందేహము లే।కనుమజెంద॥ హె॥
మల్లెలుమొల్లలు।మంచిగొజ్జంగుల్।కొల్లకొల్లలు।పాన్పునజల్లా॥ హెచ్చ॥
జిలిబిలిపల్కులు।వలపుల్ గలిగించి।వలిమలికొమరితకలయన్॥ హెచ్చ॥

## 2. వ హెచ్చరిక.

ఆనందభైరవిరాగం—ఆదితాళం.

హెచ్చరికజగదీశ । హృతదురితకోశా । హెచ్చరికభవనాశ । హెచ్చుగను మేశా॥హె॥
హెచ్చరికజగములోగి।మెచ్చపరమేశాహెచ్చరికపీఠాపురికిశసకలేశా॥హె॥
నడుతలస్ వెల్గుపెంజడపాగగాగ।జడపై నెలతురాయిసరిఫేషుగాగ।
కడుపులితోలుబంగారుపుట్టముగా।తోషప్పపై గన్పింపదొడరెనురబాగా

ఫణిభూషణములతో। భస్త్రగంధముతో। యశిమూదిఘృణులతో నైశ్వర్యములతో।

మణిభూషాలంకార। మహిత పార్వతితో। నెనసిముచ్చటదీర। నేలుముగదయతో॥ హే॥

ఘనుగుజ ద్వదిమై। బూదిబూదలంగ। ఘనుకమేబ్బంగార। ఘంఛమకమునగా
ఘనకంఠగిరళంబుకి స్ఫూర్తిగాగ। కలనాదమనగ హుంకారరవముదగ॥ హే॥
శ్రీబాలకామేశ్వరీ। బాలతోను। జాబిల్లికాకలను। చల్లార్పగాను
పూపాన్పుపైతులన్। ంది బాగాను। శాబానసగనిమ్ము। సతికిసామేను॥

ఉ. ఈగతి పల్లవాధరలు • హెచ్చరికల్ పొసగించినంతలో
నాగగనాంబుసుంకుకరు • రస పూరిత మానసాబ్జుండై
లోగిటికేగుచోఁ దనత • లోదరి మాటనిఁ జూచి తల్పులన్
బిగము వైవ మూసి చను • నేసతికైనను లోకు వాగదా.

(1.) వ. సం వా ద ము.

శి—దూతిఁ బల్కిన పల్కులన్ విని • తోడనే యరుదేరితిన్
నీతిగాదిటు తల్పుమూయుట • నీకు లోకన శంకరీ
పా—నాతులెందరి నోతమింపగ • నాయకుండవైతివి హరా
లోతుగుండెగ లాడనంచును • లోనెఱుంగర శంకరా.
శి—నేను బొందిన చానలెవ్వరో • నిర్ణయింపవె సుందరీ
కానిమాటలు బల్కనీకు సి • కౌసమా ధరకంధరీ.
పా—కానిమాట లెదాయకావని • కాంతలందు భ్రమించుటన్
నీనిజంబెవ్వరు మెఱుంగరు • నీటుదాచకు శంకరా
శి—గోలసేయక తల్పుదీయవె • కోపమేలమనోహరీ
వీలుగాదిటు వీనిఘ్నించుట • విభ్రమా భసుధాధరీ.
గం—నీలఘంధలపాగజుట్టిన • నీమమెంకుకు దెల్పరా
యేలనిల్వెడి రేలనేగుట • కేమి హేతువు శంకరా
—పాగగాదిది పెంజెడల్ దల • పైనజుట్టితి చండికా
యేగితిని రేలందు భక్తుల • యిండ్లలోనికి బాలికా

పా—నీగుణంబులు నీచరిత్రలనే • కముల్ చెల్పింతురా
యేగునీమెయి మంచిగంధము • నేవెలంది యుండెరా
శి—నీమనంబున దోచినట్లుగ • నిందమోపుట ధర్మమా
భామ నీపయిగలుగు మోహపు • పాండిమంబని యెంచుమా.
పా—కావరుల్ నిజమాడరని లో • కంబునందు ప్రసిద్ధిరా
సామి నీసిగపువ్వుమర్చిన • జాణయెవ్వతె దెల్పరా.
శి—ఓసతీ హాలాహలోజ్వల • నోష్ణగతి చల్లారు పం
గాసిరంబున దాల్చు చంద్రుఁడుఁ • గాని విరిగాదుగమ్మలీ.
పా—హాసనిర్జిత చంద్రికా ధవ • శాంగ మంగళదాయకా
భాసురమ్ముగునట్టి నీసిగ • వాసిరేగుట జేలరా.
శి—నాదుహస్తమునందు గలహారి • ణంబు వేణిస్తృణంబుగా
నాదరించి గ్రహింపరేగుట • లామె సింధుర గామినీ.
పా—మేదురంబుగ నీదువా తెర • మీదనొక్కల చందమున్
సాదరంబుగ దెల్పరా ఘున • సార సారయశస్కరా.
శి—దొండపండని కీరమొక్కటి • దొంగిలింపగ వచ్చి నా
కండువా తెరనొక్కగా నొ • క్కలుగనంబడె నంగనా.
పా—చండశాసనుడన్నమాట ని • జంబుగా సకలేశ్వరా
నిండినీకె చెలంగు కైతవ • నీతిశాలివి శంకరా.

(2.) వ సం వా ద ము.

శి. శా—ఏమెచిల్కలకొల్కి యేమొనగునా • యేమేప్రాణాధిక
యేమేయీనిశితల్ప మాయెదగునా • హెంబాలకామేశ్వరి
పా—కామాంధుండవు సంధకారివి • తమోగ్రస్త ప్రచారుండనే
నీమంబొప్పున నీకుచీకటి • పవల్ నిర్ణీతమేలన్ శివా.
శి. శా—రామా నేను పరాంగనా విముఖతన్ • రాజిల్లుచుంటేంగదే
నామీదన్ బలువాదులాడదగునా • నారీశిరోరత్నమా.
పా—నీమాటల్ వినబొంకులంచు • మదిలో నిల్పంగ దోచెంగదా
యేమందున్ శివవక్త్రమందు • పసుపయ్యెన్ దీనికేమందువో

శి. శా—గోలా నావసనంబునన్ బసపుడా • గుల్ గావు వీక్షింపవే
చేలంపుంబులి తోలుమత్సలు • గదే శ్రీబాలకామేశ్వరీ.
పా—యా లేనీగళమందు నల్లగలువల్ • హారంబుగా గ్రుచ్చి యే
భామారత్నమలంకరించినదిరా • భావింప సర్వేశ్వరా.
శి. శా—సుదతీ నామెడనల్లగల్వసరులం • చున్ బల్కగాధర్మమా
యిది నాకంఠమునందు గల్గువిషమ • ట్లాచ్ఛాయగాదే సఖీ.
పా—యవియేరాకను లెట్టులామెనుర ని • దానిస క్తిన్నన్నాయె నా
పదరా తిన్నగ బొంకులాడక నికన్ • పద్మాక్షిత్వ జామర్దనా.
శి. శా—సఖియూకస్తవ కెంపుగన్గొనిన ని • చ్చల్ భాగ్యరేఖల్ గదా
వికలత్వంబొసరించి తౌమదికివిన్ • వేమూగు వేడన్ సతీ.
పా—యకటా కాటుకడాగులయ్యెనుర శు • భాంగంబుపై నెల్లడన్
ప్రకటంబైసరి లేర పీఠపుర శుంభద్గేహ • సర్వేశ్వరా.

(3.) వసంవాదము.

శి—ధర్మవణీగణ నిర్మిత భవ్యక • వాటము దీయవె గారీ, యిక
పా—నుర్మహృదయ నీమక్కువ దెలిసెను • మాటాడకపోవా యీమా
శి—దూతిక నంపిన తోడనె వచ్చితి • తుందుడు కేలనె గారీ, యిం, తుం
పా—ఖ్యాతియె యింతటిరాతిరిదాకను • యచటికివెళ్ళిడికోయీ, శి, య
శి—భక్తులయిండ్లలో భజనలు సేయగ • బడసివచ్చితినె గారీ, సే, బ.
పా—భక్తులయిండ్లకునరిగిన ముగమున • వరకుంకుమ మేమోయీ, శి.
శి—కుంకుమగాదది యగ్నినేత్రమని • కోవిదులందురె గారీ, యిద, కో
పా—పంకజహారము లెట్లతెచేసెను • బాగుగ దెల్పగదోయీ, శి, బా
శి—పాములనడిగెను తమ్మునరులను చు • భావింతినోందితివి గారీ, (భా
పా—సామిగ తలనెక్కిన చెలియెవ్వతో • సరళిని దెలుపగదోయీ, శి, స.
శి—కలజగములను పవిత్రముజేసెడి • గంగానదియిది గారీ, యిది.
పా—నలినజనుత మృగమగు నగుమొగము • న్నదికారణమేమోయీ శి.
శి—నదివికసించిన సౌరభసలలిత • నలినంబేమో గా, యది.
పా—నదిగలపద్మంబైతే కనులు క • నంబడుచుండెనదేరా, శి, క.
శి—ఆవినీలాలక గంగజనించిన • యూడిన లే గా, యూ.

పా—కలతలయుగ కుంతలములు గలపిక • దానికేమనెదవోయీ, శి.
శి—నలిన దళాక్షిరో నదివ్యాపించిన • నాచుగాదటె గొల్లె, యది.
పా—చిలుకపలుకులువచించుచున్నయా • చిత్రము దెలుపగదోయీ శి
శి—కనుగొనలేనది విహరించెడి ఖగ • కలరవములే యెమో గొ, క.
పా—ఘనతరసుందరకాయమనోహర • కంఠముగలదేమోయీ శి, కం
శి—జనసుత గంగాఝరిని జనించిన • శంఖముగాదా గొల్లె, యిది.
పా—వనరుహభవముఖ సురగణవందిత • బాహువులేమోయీ శి
శి—బాహులుగావవి తామరతూడులు • బాగుగ జూడదె గొ యిది
పా—సాహస ధైర్యకళాలక్ష్మానిధి • చన్గుంతులు గలవేరా శి, చ.
శి—స్తనములుగావవి నదినిగటించెడి • చక్రవాకములు గొ, యివి చ
పా—మెనయగసుందర తరమైతగువళు • వెక్కుపున్నవేమోయీ శి, వె
శి—సరసిజ నయనాసురనది గలిగెడు • కెరటములే యెమో గొ యివికె
పా—కెరటములైతే పొక్కిలియున్నది • తిరముగదెలుపగదోయీ శి, తి
శి—పొక్కిలిగాదది నద్యావర్తము • పోల్చిచూడుమిక గొ, యిదిపో.
పా—పిక్కలేలననావర్తంబైతే • పిరుదులున్నవేమోయీ శి, పి
శి—గంగాస్థిత కాంచనపులినములవి • గారవింపగదే గొ, యికగార
పా—గంగాస్థిత పులినములైతే జం • ఘములుండుట దేమోయీ, శి
శి—మర్మమేల జలచరము లనందగు • మకరంబులు సుమి గొ, య,
పా—మర్మములేదని మకరములనెదవు • మందగతులవేమోయీ శి మ
శి—రాయంచలనడకలు గావటె • యపరాధ మొంచక గొ, యప,
పా—హాయిగ జెప్పితి వన్నిటికన్నియు • నాఖ్యను దెలుపగదోయీ శి,
శి—సకలేశుండని సజ్జనులందఱు • సన్నుతిజేతురె గొల్లె
పా—సకలేశుండని నేనెఱుగుదు నిజ • సంగతి దెలుపగదోయీ శి,
శి—రుద్రుండనుచును నుతిజేసెదరని • రుద్రాదులునను గొల్లె, యని
పా—రుద్రుడవైతే రుద్రవాటిదరి • రూఢిగనుండగదోయీ శి, రూ
శి—సురుచిరమగునా పేరులు జెప్పెద • శూలంధరుడనె గొల్లె, నేశూల
పా—మరిమరి శూలకు వైద్యులచెంతను • మందుభుజింపగదోయీ శి
శి—నిజముగ నీభక్తులు నీలకంఠుడని • నెనరునబిల్తురు గొల్లె, నె

పా—నిజమూడితివిక నీలకంఠపములు • నెలనడవికిపోవోయీ శి, నె
శి—పంచాస్యుండని పుణ్యపురుషులల • వాటుగిబిల్తురుగాకి, లల.
పా—పంచాస్యుడవైతే కొండగుహల • బారిజరింపగదోయీ శి,
శి—అగ్గిపట్టుకొని యానతిజేతున • న్నాదరింపవే గాకి, నన్నా
పా—అగ్గికన్నుల మాపోవ్రిదవు నీ• కగ్గియనంగ భయమేరా శి, అగ్గి
శి—పాముబట్టుకొని ప్రతినజేసెదక • వాటముదీయవె గా, పా,
పా—పాములెత్తొడవులుగా మోపిన నీ• కేమిభయముగదవోయీ శి,
శి—నృపలని పాణము పిసికించినచో • విషముదాగెద గా, నే. వి
పా—విషమె సుధామధురసమని మెక్కగ•విషమె హితవుగదోయీ శి
శి—నిజముగ మొక్కెదజాలమేలనిక • నీకులోలుడనె గా, నీకు,
పా—ద్విజుడై వెలయు ద్విభాష్యము పుల్లకవిని•బోవంగదవోయీ శి,

---

## బ్రహ్మోపదేశము.

### (4.) వసంవాదము.

శి—కలికీచిలుకల కొలికీ రతనపు తలుపుదీయవే గా,
పా—తలుపులు దీయతగదికతెగద లదానింటికి పోవోయీ శి.
శి—దానిల్లెచటనో దారియెట్టుంగను దాచక తెలుపవె గాకి,
పా—దేనిదరిని బయల్దేరిటు వచ్చితొ తెరువదియే పోవోయీ శి,
శి—ముక్తికాంతని గనుగొనివచ్చితి నీమోముజూపగదే గా,
పా—ముక్తికాంతగలవానికి యింతటి మోహమెందుకుగదోయీ శి,
శి—మోహము ప్రకృతి మోహలక్షణము ముద్దియవే యో గాకి,
పా—మోహంబుడు గనిమోక్షానికి యెటుముక్తిగల్గె పోవోయి శి;
శి—మాయకులోబడినట్లుగు పడుపరమాత్మ రూపుడనే గాకి,
పా—మాయగెలచి పరమాత్ముడయిన యామర్మముదెలుపగదోయి శి
శి—తానసుమాయను సాంఖ్యమున తారక మెలవదు గా,
పా—దానిదెలసు కొనుతరువాత గలనిధానంబేదగునోయీ శి,

శి—గమన తనంతనె యమనస్కంబుద యంబై నిలుచును గా,
పా—అమనస్కంబై నంతనె బ్రహ్మమయాధారంబేదోయి శి,
శి—ఆధారసహస్రాంతర లక్ష్యావలోకనము గా,
పా—ఆధారసహస్రాంతర లక్ష్యంబచలముగనుగాదా శి,
శి—దేహికి జీవన్ముక్తిని బొందనిదేయుపాయ మగు గా,
పా—దేహమనిత్యము దీప్తి యెసత్యమదే బ్రహ్మంబగుగాదా శి,
శి—సోహంబ్రహ్మాస్మియనెడును పరిశుద్ధసిద్ధియగు గా,
పా—దేహికిజీవికి గాలి ఘట్టలో దీపసామ్యమగుగాదా శి,
శి—భోగభాగ్యముల బొందుచు కుమ్మరి కుమ్మరపురువుగమనవలె గా,
పా—రాగభోగ మనురాగ కుశలమగు రాజయోగమిదిగదా శి
శి—రాజయోగమన్నిటికన్నను బహురమ్యసాధనము గా,
పా—శ్రీజనకాదులు రాజయోగులై సిద్ధిని బొందిరిగాదా శి, శిద్ధి
శి—రావుచెల్లయాంబికా రామయాంబికలు రాజయోగినులు గా,
పా—నీవెవ్వరు సన్యాసియోగివా నిజముగ దెలుపగదోయీ శి,
శి—సాక్షాత్పరమేశ్వరరూపుఁడనయి చయ్యనవచ్చితి గా,
పా—మోక్షసతిని నేముద్దులగుటకగముచ్చట నెనసెదనోయీ శి,
శి—నీలోనాలో భేదంబేమిక నిర్వికల్పమే గా, యిక
పా—చాలిక తలపులు సడలించెద శివ సాయుజ్యమునెనయుంగా శి,
శి—శ్రీద్విభాషి పుల్లకవీంద్రుఁడు మనశిష్యుఁడుగాడా గా,
పా—అద్వైతుఁడతఁడు పరమపావనుండతనికేమి కొదువోయీ శి,

సంధి వాక్యము.

క. తలనున్న గంగ నతనిని బలుమరు వర్ణించి చెప్పి • పలుకన్వినితా
నులికిపడిగంగయిట్లనిపలుకంగఁదొడంగెనతితోఁ•బరుషవచనముల్.

గం. కందా—ఓసీ ! నీకొఁగిటిలో నాసకలేశుండు • సరసమాడంగని
నే తీసుకొనిఁ గూడినానటె కొసంతయు నీకుసిగ్గు
కలదటెగౌరు కలదటెగౌరీ నీవలలోనుండినవాని •వల
పింపలేక నా, వలనుంచితివి సిగ్గుకలదటెగౌరీ.

౫. కం—ఓసీ! దాసీయనుచును వాసినికని పెట్టకుండ • జల్లుకదగునే!
వాసెంత నీవునెంతటి నాంవతివె పాగినినెత్తి • నాడినగంగ
యాడినగంగా నీతోడ వాదించుటకు • గూడదు
సురవేశ్య కులటవుగ దెనెత్తి • నాడినగంగా.
౬. కం—తగువే తగ్గుము నీవాక
తగువరివా శక్తిరూపు • దాల్చి క్రమముగా
మగనిని సగముగ జేసిన
మగువవుగదె నీవు నీతి • మాలినగౌరీ
శూలధరుడు నీకు • లోలుడైతే నీదు
పాలుగా నేనుము నా • జోలితల్పక నీతిమాలిన.
౭. కం—రాతిరి పవలును ఏకక్రీపు
రీతిని గమనింను నీకు • త్రిజగంబులలో
నీతియు జాతియు నేమిటి
చాతుర్యము మానుమింక • జాలరిగంగా
జాలారిగంగా నీ • జాతి నీతులు జగ
జ్జాలమంతటను వి • ఖ్యాంతమయ్యెను గదె, జా.
౮. కం—రంగులు బంగులు దాల్చి పర
సంగంబున నెంత వాగ్ర • చనల వలపినన్
గంగాధరుండు నిను న
ర్థాంగీకారమున బొందె • నది గానపటే.
యదిగానవటే నీ • యతిశయమే మింక
పదవే తిన్నగ నీదు • భవనంబులోనికి॥య॥
౯. కం—మగడు చను విచ్చినంతనె
మిగులగ లొంగించి నెత్తి • మీదెక్కితివే
జగమున సతు లెవరైనను
తగిరటె యీ పసికి గడుసు • దానవె గంగా॥గడు॥
దానవు గంగా నీ • మానము దెలసెను
లేని పోని మాట • లల పోవద గడుసు దానవుగంగా॥

గా. కం—[illegible]పు చెల్లయాంబో
[illegible]రామయ్యాంబికా వ • శీకరుఁ డగుమన్
వారి యభీష్టము లొసఁగిన
మేరుధనుర్ధరుఁడు శిరము • మీఁద నిలిపెనే
మీఁద నిలిపె విమ • మేను రాగ్నె కంతా।
సాదితమై యుండఁ • గా నాని చల్లంర్ప॥మీఁద॥

గా. కం—సమరసగాగి సమాధా
నము జెప్పిన నిన్ను మెచ్చి • నగుఁగిదె తరుణీ
తమకంబునగని పలుకులు
గమి చెడక వచింప గదవె • గంగాభవనీ।
గంగాభవానీ నీ • ఘనం మెల్లఁ గానుకో।
నంగిదె పొకితె • నంబెల్ల చాలించి॥గంగాభవానీ॥

గం. కం—మనమిద్దఱ మొకచోటనే
జననంబైతి మిమ్మడాని • శైలముమనపు
ట్టినయిల్లు మనలకిపుర
కును నాధుడు శివుడుగాడె • కొదువేమెనునకుయిక,
కొదువేమెమానకు భ • క్తుఁడు పుల్లకవిక్రుత,
పదములుబాడుచు • భవుని సేవింతము॥ కొదు,

గీ. గంగయును గౌరియిట్లు స • ఖ్యము వహించి
భవునిసన్నిధినుండు నా • దంపతులకు
ధూపదీపనివేద నా • దులనొసర్చి
రతనపు నివాళులిచ్చిరి • రమణులెల్ల

మంగళహారతి.

సురటరాగం—ఆదితాళం.

మంగళం-మంగళం-హేజననీ-మం॥
మంగళమంగజ-భంగసమాభిఖ్య-గంగాధరాత్మజ-రంగసారంగా
శృంగారితాభవా-ర్ధాంగీసుకృతిసర్వ-మంగళాగారకు-రంగదృక్సంగా॥
హారపటీరసీ-హారమందారడిం-డీరసు-ధీరాకరు-పారిజాతారా

తారాహారదానార-దశర-శరశ్చంద్ర-శారయశఃపూర... రహారాను
కుందరదనశర-దిందువదనా సన్-మందహాసాభద్ర-మం...
కందసద్మశకచ-బృందబృందారక-వందితచరణార-విందా సానంద...
బాలాత్రిపురసుంద-కీలాలితగుణ-జాలాకరుణాల-వాలసుశీలా
శ్రీలక్ష్మీచర్మ-చేలయాశ్రితభక్త పాలినీ-యోగినీజాలమికేల॥ మం
వాసిగశ్రీరావు-వంశాభరణ చెల్లాం-బాసతీ నేలినభాసురాంగీ-భాసుర
దైనద్రాక్షాపి.పుల్లకపీం-ద్రిదాసవర్గాన సువిలాస-జగజ్జననీ॥ మం

మంగళహారతి.

ఆనందభైరవి రాగం — ఆటతాళం

లింగానికిదేమంగళం-భవ-భంగానికిదేమంగళం
లింగా-వృషభవాసు-రంగాగంగోత్తమాంగాసుకరకు-రంగానక లేశ॥ లింగా
వీరా-విగతవి-చారాభక్తమం-దారానతసుకు-మారా శివదివ్య॥ లింగా
బాలా-హృదయవి-లోలాసుగుణవి-శాలాసురముని-పాలాశివదివ్య॥ లిం
శ్రీరావు చెల్లాంబి-కారామ మహాత్మవి-హారా వేదప్రి-చారాహారదివ్య॥ లిం
శేషాకలాపద్వా-క్షాపిపుల్లకపీంద్రి-పోషానిత్యసంతోషాకరదివ్య॥ లిం

చ. ఘనతర రత్నదీపకళి • కాంతరులు జ్వాలమై వెలుంగనా
వనితలు మంగళంబులను • బాడుచు హారతులీయభక్తులున్
మనమల రారసాంభసు • మంబులు గంధమలంకరించి పెం
పొదవగ సింహపీఠమున • నుంచిరి చంచమునూ మహేశులన్

పూజాక్రమం.

సురటరాగం — ఆదితాళం.

పూజించి వేడుకొనరే-భక్తులెల్ల-శంకరు॥ పూ
పూజింపరెఘున పుణ్యచరిత్రుని-యేజగముల నే-లినపరశివుని॥ పూ
శిరోభూ-షణుడగు దేవుని-రమ్య బాలకామేశ్వరీశునీక॥ పూ
ధ్యానమునావా-హానపాద్యాదులు-సూనగంధములుశోభిలుచుండ
స్నానపాననై-వేద్యంబులనిడి-పూనియుపచరణ-ముల సేవింపుచు॥ పూ
సకలేశుడుని-ర్వికల్పడాద్యుడు-ప్రకటద్రాక్షాపిపు-ల్లకవినుతుడు
సకలమైన సేవకజన ఫలదా-యకుడగు చెల్లాం-బికావరదునిక॥ పూ

గీ. భక్ష్య భోజ్య చోష్య పానీ • యలేహ్యముల్
ఘుమఘుమ వాసనల్ • గుప్పుమ్రింప
నయభక్తు లందరు • నైవేద్యములనిడి
రందఱొక్క మొగిన • యం... మీఱ.

ఆ ర గిం పు సే వ.

ఖగహంసప్రియ రాగం — చాపు తాళం.

ఆరగింపరా సకలేశా నీ — నారగింపరా
ఆరగింపు భక్ష్యభోజ్య చోష్యము — లరటిపండ్లు మామిడిపండ్లు పనస ॥ఆ॥
అన్నము తిమ్మనమప్పడములును నొడి — యంబులును కొళం — బొడిగ శాకము
బూరెలరిసెలప్పములును గారెలు — బొబ్బట్లును నీ — కమృతము స్వయముక ॥నా॥
పాలు పెరుగు తే — నెజున్ను మీగడ — పంచదార పా — నకంబులొసగితి ॥మూర
పండుటాకు వేలకులు వళా(గపు — పక్కలు — కస్తూరి — పచ్చకర్పూరం ॥బా
చెల్లయాంబికా — చిత్తపద పంకజ — ఫుల్లకవిసుకృత ఫల ... శివ నీ ॥వార

ఆ ర గిం పు సే వ.

రెండవ మోస్తరు, ఖరహరప్రియ రాగం — ఏక తాళం.

ఆరగింపగదరా — శంకర ॥అర
ఆరగింపుము మంచి — బూరెలు బొబ్బట్లు — గారెలప్పములు — కజ్జంకర్జకాయ
పానకంబును పాలు పంచదారయు జున్ను తేనెయరటిపండ్లు తియ్యము ... ॥
అన్నము తిమ్మన — మప్పడాలొడి యము — లన్నియు దెచ్చి నీకర్పించినాము॥
చెల్లాంబికాచిత్త — శ్రీపాదపంకజ — ఫుల్లకవిస్తుత — భోజ్యములన్ని ॥నీవార

క. ఘను డారగించి సంతసె
కనకాంగులు హంసతూలి • తాల్పముపై
నునిచిరి యుమామహేశుల
గొనబుగ దంపతులు శయ్య • గూర్చున్నతరిన్.

క. అత్తరువును పన్నీరును
నుత్తముగా నొకరికొకరు • నూర్చ్మి లరగిన్
సత్రియు సకలేశుడు తమ
మిత్రని దేహముల నలది • మెలగిరి వగలన్.

పార్వతీ పరిణయ కలహ పద్యాలుం

క. తనుబంపిన దూతిక చెం
తనువచ్చిన చులకన జేసి • తలుపుబిడాయిం
చిన సంగతి స్ఫురియించిన
పరిణయముతో గౌరికిట్లు • బలికె భవుఁడుదాన్.

గౌరీశ్వరుల సంవాదము.

శి. కం. దూతికనంపిన తోడనె
చేతోమోదమున నీదు • చెంతకురాగా
నాతరమరయక తలుపులు
మూతలు వేయింపఁదగునె • ముద్దులగుమాత్ర

గౌ. క. సేవకుల యిండ్లలోనికి
బోవలసినదనేఁడు నెపము • బూనిపరస్త్రీ
భావజ కేళీమందిర
భావాగతిమనుట తల్పు • వైచితిని శివా.

శి. క. చెలికత్తెలిచ్చ కములుగ
బలికినయువి నమ్మదగునె • పరమపురుషులై
వెలుగొందెదు ధీరులు పెర
చెలులవరింతురటె మోహా • చింతను సాధ్వీ.

గౌ. క. నీరూపము లావణ్యము నీరవ్యవిలాసగతులు • నేవిడలేక న్
దూరితినిగాని దోషవిదూరుడవని నేనేరుంగు • దునుసకలేశా.

శి. క. కొండలరాజతనయవై, యుండుటచేగాదెధైర్య• మొప్పబలికితో
చండీమెచ్చితినాయం,దుండినతమిబాయలేక • దూరితిననగన్.

గౌ. క. వినుకొండ ధ్యానస్థైతినం
దిని వాహనమగుమ పశుప • తిత్వముగలమి
మ్మెన్నసి పతిగాగ గొంటిని
మనవిని వినిదెప్పటిఁక • మానుడి యభవా.

శి. క. పరిణయమున బలికితివి యువి
కినుకకు మూలములు గావు • కించపడకునా

తనుగద్ధ మొసగితిని న
న్ననయము నెడబాయకుండు • మదిగ్రుమారీ.

చ. శిరమున నున్నగంగ శశి • శేఖరుడద్రిజ కర్ధదేహము
చ్చెరువుగ నిచ్చియుండుటయు • చిత్తజ కేళికిసమ్మతించుచుఁదల్
మురిపెము లెల్లజూచి శివ • మూర్ధమునుండి గుభాల్నదిగ్గి నా
గిరిజ నెదిర్చి యిట్లుబలి • కెన్ వలపుల్ గని గంగయోర్వకన్.

స వ తు ల క య్య పు సం వా ద ము.

సారంగ రాగం — ఆదితాళం.

గం — ఎవ్వతెవేనీ-యెక్కు-వేమిశివు-నేనయాగవచ్చితివి-పోపోవె గౌ, ఎ
గౌ — రవ్వలాడినోరాచిపలుకగదే-రాకు రాకుయిక పోపోవే గం, రా
గం — నాథునిసగమాలాగున జేసిన-నాతివిగాపటే-పోపోవే గౌ, నా
గౌ — నాథునెత్తినెక్కి-నాట్యమాడినసంగ-నాతివిగావటె పోపోవే గం, నా
గం — శివశక్తివియనిజనులనగనుదా-శీనము లేదటె పోపోవే గౌ, శీన
గౌ — శివుశక్తినినేనేగాపునమతి-జేయుటగాదటె పోపోవే గంగ
గం — కొండదాననీగొప్పమెరుగుదును-గొప్పలుబలుకక-పోపోవే గౌ
గౌ — కుండగోడుమారివిగావటెనీ-గొప్పయేమిటిక పోపోవే గం,
గం — చాముండాయనిపించకొనిన-నీసంగతెరుగుదును-పోపోవే గౌ
గౌ — ఏమోమొర్రిగెడవెప్పుడుజూచిన-నీడ్పించెదనిల పోపోవే గం
గం — పారిపోకేపతినోడిలో-వేసుకపతినోసంగిమరిపోపోవే గౌ,
గౌ — పారిపోయెడునవ్వ-భావమెవ్వరిదో-పగ్రజలెరుంగరటె పోపోవే గం
గం — కుంకుమమోసెనుగుడిలోశక్తివి-గొప్పనుకొంటివిపోపోవే గౌ,
గౌ — వంకరతిరుగులుతిరిగెడునీతో-వాదమేలనిక పోపోవే గం
గం — రాకయున్నమగనిఁబత్రిమాలిన-రాణివిగావటే, గౌ
గౌ — రాకాసీయనమగనివిడిచి-వారణాసిదనవటె పోపోవే గం
గం — గౌరికులగోత్రములబుట్ట లేదటే
గౌ — గంగకులగోత్రములు నీకుగలవటే
గం — గౌరిమాటకత్తెవునీవుగావటె
గౌ — పోరాటకత్తెవునీవుగావటే

గం—గౌరినోరంజిల్లగాచుగాదటే
గౌ—గంగపోరేలనదినీకుబువ్వటే
గం—గౌరికోసింపలోకులు నవ్వరా
గౌ—గంగనాపంచజేరవెనాఁటిరో
గం—గౌరియక్కరో మొగ్గలనందవే
గౌ—గంగమక్కువతో గలిపియుండమే
గం—గౌరియిక నేలు పీఠాపురీశుఁడు
గౌ—గంగ యిక లంకసకలేశుజాతఁడు
గం—గౌరి చెల్లాంబనెల్లరక్షింతమే
గౌ—గంగపుల్లకవీందుగ్రిబిత్రమే

గీ. అనుచు గంగయు గౌరిస్నే • హమును బూని
సకలసామ్రాజ్య వైభవ • స్థాయులగుచు
దండిపకలేశ్వరుని గూడి • యుండిరంత
లాలిపాటలు బాడిరి • లలనలెల్ల.

## లాలిపాట.

అనంద భైరవి రాగం—అటతేక చాపుతాళం.

లాలీశ్రీవరగిరీశా-పరమేశ-లాలివిశ్వప్రకాశా
లాలిబాలామణీశా-సకలేశ-లాలిపీఠాపురీశా॥లా
బాగైన సౌధమునను-రతనంపు-తూగుటుయ్యాలలోను
రాగములబాడివిన్నా-నిద్రించు-లాగునూ చెదమిదేను॥లా
అంగీకరముగి వలచి-మాసర్వ-మంగళాదేవినెనసి
సంగీతములనుదసిసినిమురింపు-మంగజావస్థగెలిచి॥లా
నవరత్నఖచిత్రమైన-హేమంపునవ్యసింహాసనమున
ఉపిజులందుగుగొల్చిన-వరములిడు-భవశతారాదిభ్రవన॥లా
ఉల్లాసకలితబాలా-శ్రీరావు-చెల్లాంబికాత్మలోలా
సల్లలితహృదయమూల-ద్విభాషి-పుల్లకవిసుకృతిజాలా॥లాలీ

జోలపాట.

జోజో గిరిశరాజ-జో యభ్రకేశా-జోజో దురితనాశ-జోజో జగదీశా॥జోజో॥
జోజో మధురవాణి-జోజో కల్యాణి-జోజో బంభరవేణి-జోజో మృడాని॥జో॥
జో పర్వతకుమారి-జోజో సుకుమారి-జో సుందరాకారి-జోజో శివగౌరి॥జో॥
జో చెల్లమాంబావ-చోన్నతస్తోత్ర-జో రామమాంబావ-నారమ్యగోత్ర
జో పుల్లకవిపోష-ణీపద్మపాణీ-జో పురాణీమేరు-చాపధరురాణీ॥జోజో॥

శోభనపుపాట.

సారంగరాగం—ఆదితాళం.

శోభనమే శంభునకు-ఘనశోభనమే పార్వతికీ॥
శోభనమే యంగజ-వైభవములు పరి-శోభింపగ సుత-లాభకరంబగు॥శో॥
సలలితసౌరభ-ములు ఘుమఘుమయన-నలవుల నవపు-వ్వుల పానుపునను॥
అత్తరు కస్తురి-యగరుగంధములు-చిత్తము కోలం దిని-యొత్తుగ నలదరె॥
రావు చెల్లాంబికా-రామమాంబికల-భోగ్రవనలరు మహా-దేవునకిప్పుడు॥శో॥
లలిపుల్లకవివ-రదుండై పురహరు-డలసి నిదురగొనె-తలుపులు మూయుడి॥

ప్రమథగణరక్షకత్వనిరూపణము.

కం. ప్రమథగణాధ్యులారా!
యుమయును సకలేశ్వరుండు • నొద్దికను శుభో
త్తమ నిద్రను బొందుచుండిరి
సముదంబున మీరలుండి • జాగ్రత గనుడీ.

దిక్పాలకరక్షకత్వ నిరూపణము.

కం. ఉమయును సకలేశుండును
సుమతల్పమునందు భావ • జుని ఘనకేళిన్
దమిగూడి నిద్రఁజెందిరి
ప్రముదంబున వీరిగావ • వలె నమరేంద్రా.

యాల. అందమైన మేడలో నిం • పొందఁగా బాలామణితో
నిందుధరుఁడు పవళించెరా • ఓ పురందరా-యిందు భద్రముగానుండరా.

కం. వరపీఠాపురసకలే, శ్వరుఁడంగజకేళిదేలి • పార్వతితోని
ద్దురఁబోవుచుండెవైశ్వా, నర నీదిశ నీవు రక్ష • ణము సేయవలెన్.

యాల. చేతోమోదమున శైలా • రాతిదిక్కు నాతడుండె-నీతరి
నీదిక్కు-గాయరా నీతిహోత్రియా • రాతిరిజాగ్రితనుండరా॥
కం. దండధరకుసుమసాయక, భండనమునవలసిసొలసి • పార్వతియుగిరీ
శుండునుశయనించిరియిట,నుండుముభద్రంబుగాగు•ణోన్నతమతినై
యాల. రంగుమీరగాను సర్వ • మంగళారతుల వలసి
యంగజారినిదురించెరా•ఓదండధరా-చంగున భద్రముగానుండరా.
కం. రక్షోనాయకగౌరీ, వక్షోజద్వయవిలిప్త • వరగంధలస
ద్వక్షుండై పవళించెను, దక్షాధ్వరహరుఁడుజాగ్రి • తనుగావవలెన్
యాల. యక్షకిన్నరకింపురుషా • ధ్యక్షులు సేవించిపోగ-నుక్షతురగుడు
పరుండేరా-రాక్షసేశా • దక్షత భద్రముగా నుండరా.
కం. వరుణా నీదిశ భద్రము, ధరజాబింబోపమిత సు • ధా ధరపానాం
కురితపరవశముతో ని, ద్దురఁజెందెనుహరుఁడు తెల్వి•తోనుండవలెన్
యాల. ఆటపాటల జోకొట్టి • బోటులిండ్లకేఁగిరగ్ని ల
లాటుడునిద్రింపుచుండెరా•ఓవరుణా!యీపాటిభద్రముగానుండరా.
కం. మారుత నీదిశజాగ్రిత, తో రూఢిగఁగాచి తెల్వి•తోనుండవలెన్
గౌరీ గాఢాలింగన, భారముపడలింప హరుఁడు • పవళించె నిటన్.
యాల. వీడెముల్ సేవించిగౌరి • తోడ జోడుఁగూడి శివుఁడు
వేడుకనిద్రింపుచుండెరా•ఓవాయుదేవా!దాడినిభద్రముగనుండరా
కం. ఓయికుబేరా?శుభసం,ధాయకుడగుహరుఁడుపుష్ప•తరతల్పముపై
నాయకితోసుఖముగని,ద్రాయుతుడగుజాగరూక•తనుఁగనుగొనుమా
యాల. బాలకామేశ్వరీ సతీ•లోలుఁడై పూలపాన్పున శూలినిద్రనేలు
ఓయీ! కుబేరా? చాల • భద్రముగా నుండరా. [చుండెరా
కం. ఈశానఁ గాచియుండుము, లేశంబేనియుకు నిద్ర • లేకుండంగన్
యాశనుద్విభాషిపుల్లక, పీశముతోఁ ముశంకరుఁడురు•హిన్ బవళించెన్
యాల. రావు శ్రీచెల్లసూర్యాంబికా • రామయా౦బార్చితుఁడై గౌరి
దేవితో పవళించి యుండెరా • ఓయీ ! యీశానా ? నీవు
భద్రముగానుండరా.

## మేలుకొలుపు.

భూపాళరాగం—అటతాళం.

మేలుకోరాసాంబ-మేలుకోరాయంబ-మేలుకొల్పి వేగ।
మేలుకో-బాలాకుచకుంకు-మాలంకృతదివ్య-ఫాలగుణజాల-మే॥మే॥
తెల్లవారవచ్చె-దిక్కులు తెలివొందె-మళ్లిపరుండక మేలుకో
చల్లగాడ్పులుల్ల-సిల్లెదీపకళిక-లెల్ల వెల్లనయ్యె-మేలుకో॥మే॥
నలినముల్ విరిసెచు-క్కలగమిమాసెత-మ్ముకముచప్పనయ్యె-మేలుకో
కలకలపక్షుల-కలరవములుహెచ్చె-కలువలు ముకుళించె-మేలుకో॥మే
కొసరుపలుక్కులతోఁడ-గుసగుసలాడక-కసికందకుండఁగ-మేలుకో
పసనల్గిజీరాడు-పసపువల్వలుజూచి-హాసియింతురెవ్వరైన మేలుకో॥మే
దేవతలెల్లనిన్-భావించుకొనుచునం-సేవింపవత్తురు-మేలుకో
రావుచెల్లాంబికా-రామయాంబికల-సేవలిపొద్దున మేలుకో॥మే
భూరిభుజంగాంగ-పుల్లకవీంద్రసం-పూజితపదపద్మ మేలుకో
సారసభవముఖ-చంచన్నుతాఘన-సారయశోగంధ మేలుకో-మేలుకో॥రా

## మంగళహారతి.

సురటరాగం—ఆదితాళం.

శ్రీకంఠశార్వ-శంబరరిపుహర-నీకు-మంగళం-శుభమంగళం
నాకాధిపగణనాధ-వందితనీకు-మంగళం-శుభమంగళం
గజదైత్యహరణనా-గకలాపగణ-నీకు॥మం॥శు॥
నిజభక్తనికరవ-ర్ణితపాదయుగ-నీకు॥మం॥శు॥
చేగానిభక్తు-చెలఁగిఁగాచిన-నీకు॥మం॥శు॥
మాకందజేకనివహా-పరములిడెదు-నీకు॥మం॥శు॥
రావుచెల్లాంబాశ్రీ-రామాంబావన-నీకు॥మం॥శు॥
దేవదేవపుల్లకవిసు-స్థిరకృతిచయ-నీకు మంగళం-శుభమంగళం॥

## ఫలశ్రుతిః

ఉ. ఈకథ నెవ్వరేనిఁ బఠి • యించిన వ్రాసిన విన్నసంపద
స్తోక నిరంతర ప్రతిభఁ • జొప్పడ నిత్యము భక్తియుక్తమైఁ
బ్రాకటశ్రీల నైహిక ఫ • లంబులనొంది శివప్రసాద సు
శ్లోకతఁ బుణ్యలోకములఁ • జూడఁగొనందగు వారలిద్ధరన్.

## స్వస్తి.

శ్లో. స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం।
న్యాయేన మార్గేణ మహీం మహీశాః।
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం।
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు॥

శ్రీసకలేశ్వరార్పణమస్తు,

సర్వేషాం సమస్త మంగళాని భవంతు,

సకలేశ్వరైకాంతసేవాకథనము,


సంపూర్ణము.